Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరు.

సంపుటము 33 { 1941 సం॥ [illegible] నెల 15వ తేది } సంచిక 5

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.



# రాజపోషకులు.

శ్రీమంతు, రాణీ ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు,
హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యాశంకరభారతీ
స్వాములవారు, పుష్పగిరి

౩ తంగెడ నరసింహారావుగారు, కరణము, మొర్జంపాడు.

౪ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౫ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు,
రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురం

౬ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౭ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

౯ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇసుమూరు.

## పోషకులు

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు
జమీందారుగారు - దేవిడి

౩ కాండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము.

# అభినవసరస్వతి

సంపుటము 33 | వృషనామసంవత్సరము శ్రావణమాసము | సంచిక ౫

## దేశదౌర్భాగ్యము

(పండితప్రవర మల్లాది రామకృష్ణచయనులవారు పరమపదించుట)

తే. గీ. అయ్యయో! పండితప్రవరాదిబిరుద
రాజమానులు మల్లాది రామకృష్ణ
చయనిగారీవృషాషాఢచరమతిథిని (23-7-1941)
స్వస్థు లైరాంధ్రదేశదుర్దశ మదెయ్యె. 1

సీ. తదాశ్రమకృష్ణ విద్వచ్చయనులుగారి
నెట్టనఁ దనపొట్టఁ బెట్టుకొనిరొ.
ఆంధ్రకర్ణాటా ద్యనల్ప దేశమ్ముల
చినుకేని బడనీక చిక్కఁబట్టె.
బొంబయిపురి వారి పూరించి ప్రజకు మ
హోపద్రవంబునే యొనరిచినది.
సంగరాగ్ని జ్వాలలం గరం బెచ్చించి
జనవినాశనమును సలుపుచున్న.
దిట్టిసంవత్సరంబున, కేలొ కాని
పెట్టె వృషనామ ధేయంబు పిచ్చిబ్రహ్మ.
వృషయటన్నది మృష యింక. విషసమాఖ్య
కర్హ మీ శేష్టవత్సర మరసిచూడ. 2

కం. సిరియును సంపద గలదు. కొ
మరులును మనుమలును నైరి మాన్యులు విద్వ
ద్వరులు. మఱి మృతి యొనుబడవ
పరువడి. వీర్ కర మదృష్టవంతులె కానీ 3

సీ. పడయఁగాఁజాల దిప్పటియంతలోన దే
శం బిట్టి సాహిత్యచక్రవర్తి.

నరటీపం డొల్చి చే నర్పించునటు లిట్లు
తత్త్వంబు బోధించు తద్ఘుఁ గనము.
ఇంతఖండితముగా హితబోధఁజేయు ను
పన్యాసకుఁడు దుర్లభంబు జగతి.
కర్మనిష్ఠయు వేదధర్మప్రచార మీ
అనఘుతోనే సరి యనఁగవచ్చు.

బహుళభారతవర్షంపు బ్రహ్మసభనె
పండితప్రవరుండని ప్రస్తుతింపఁ
బడిన యిమ్మహనీయుఁడు పడుటఁ జూడ
దేశదౌర్భాగ్యమన కింకఁ దీఱ దకట! 4

ఉ. విశ్వము వీటువోయినను వేళకు నీయన సంధ్యవార్చ కు
ర్వీశ్వరు పన్పునేని గమనింపఁగఁబోవఁ. దుపన్యసించుచో
ఆశ్వవసాయిగానయిన నయ్యది తీఱుచుఁగాని యట్టులే
పశ్వపలాపముల్ సలిపి భ్రష్టత గూర్పఁడు కర్మకాండకుల్. 5

సీ. లోకసంగ్రహముకై లోపంబు లేకుండ
కర్మకాండము సాకఁగలిగినాఁడు.
కర్మధర్మజ్ఞాన మర్మంబు లెంతయు
దిగ్దేశములను బోధించినాఁడు.
శిష్య శతములకుం జెప్పి శాస్త్రంబులు
పండితాగ్రులఁజేసి పంపినాఁడు.
పరభామినులనెల్లఁ బ్రస్వాత్మజలమాడ్కి
శుద్ధమౌ బుద్ధితోఁ జూచినాఁడు.

శ్లాఘ్యమానమైన సరణి నగ్నిష్టోమ
చయనసవనములను జరపినాఁడు.
తలఁప నిట్టి పండితప్రవరుని పోక
దేశమునకుఁ గొఱతఁ దేకయున్నె? 6.

సీ. ద్వైత శైవాద్వైత తద్విశిష్టాద్వైత
మతముల కడ్డడ్డ మాఱుమసలి

వైశ్యుల ప్రాక్ త్యక్త వైదికకర్మంబు
పునరుద్ధరణ కూడదని విధించి
క్షత్రియంమన్యులై జందెముల్ ధరియించు
కమ్మల వ్యర్థవాదమ్ము లుడిపి
సంస్కరణప్రియాసద్వాదముల కోటి
శఃఖండనంబులు సలుపఁగలిగి

అలువదేండ్లనుండి యానేతుశీతాచ
లము వెలింగి యగ్గలముఁ జెలంగి
రామకృష్ణచయనిరవి యస్తమించె. దుః
ఖాంధతమము దెసల నావరించె. 7

సీ. దుఃఖించుచున్నది తోఁప కించుకయేని
దారపుత్రాదిక తత్కుటుంబ.
మంగలార్చుచునున్న దా ప్రాజ్ఞ సన్నిధి
భాష్యముల్ చదివిన శిష్యశతము.
అలమటించుచునున్న దయ్యార్య ప్రవచనల్
సతత మాకర్ణించు జన్మజనమ్ము.
వ్యాకులపడుచున్న దాసూ ర్యపన్యాస
ములఁ జొక్కు నున్నతపురుషగణము.

తద్విపశ్చిచ్ఛిరోమణితరణి యస్త
మించునాఁడల బెజవాడఁ గాంచువాఁడ
ఎఱుఁగు. ననువంటి ప్రియశిష్యుఁడెఱుఁగు. మీఁది
కెట్టులన్నఁ బురోభాగి హృదయ మెఱుఁగు. 8

కం. త్యాగమె లేదనెడిఁ బురో
భాగియు నవ్వారియెడల. పరికించినచో
బాగుగ నదియును జగదుప
యోగికృతులఁ గానఁబడెడి నుచితంబుగనే. 9

కం. గీతాభాష్యంబొక్కటె నీతావునఁ జదివినయది నే నరసిన. త్వ
త్ప్రీతికిమాత్రము మిక్కిలి పాత్రంబునునైతి నాత్మభవులట్లు గురూ!

సీ. ఘనమైన సభలలోఁ గార్యదర్శినిగాను
నీచేతిక్రింద నన్ నిలిపినావు.
వలసినయప్పుడెల్ల బలు వ్యాసములను వ్రా
యించి మత్పత్రిక కిచ్చినావు.
మతవిప్లవముపట్ల మంచి గ్రంథంబులే
వ్రాసి యందున వేయఁజేసినావు.
నన్ను నాపత్రిక నాదు కవిత్వంబు
శ్లాఘించి శ్లాఘ్యగం జలిపినావు.
నాకు నీకు రమారమి నలువదేండ్ల
నుండి సంబంధ. మాబంధ ముడిపినావు.
శిష్యవత్సల! జీవితశేష మింక
నేను వెళ్ళింపవలయుట యెట్లో చెప్పుము. 11

కం. నీయింటి శుభక్రియలం
దీయం దలఁచితివి కట్న మిది సరికానీ
నాయింటి శుభక్రియలను
నోయార్యా! కట్న మంపుచుం. టేమందున్? 12

కం. సుతయుగ్మము వడుగులకును
బ్రతిమాలితి రమ్మటంచు. బ్రయతించితి రీర్
వితయయ్యె. అగునుగా. క
న్పితి భిక్షుల. నిదియె నీదుప్రేమకు గుఱియా. 13

కం. జాతునకు ధ్రువము మృత్యువు.
భౌతికదేహముదె ప్రకృతపాతము. మాయా
స్ఫీతమతి నగుచుఁ గ్రమ్మఱ
ఈతీ ర్విలపింపవలసె. ఏమనవలయున్? 14

కం. గురుచరితము విరచించుచు
దొరకొంటిని బ్రచురపఱుప. తోడ్తో నేత
త్పరమగురుగుణిచియును వి
స్తరముగ వ్రాసెదను. చేసెదను నిది పూర్తిన్. 15

—:o:—

## —♦ చాతుర్మాస్య పత్రిక ♦—

... శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య ... వైదికమార్గప్రవర్తక ... శ్రీ విద్యానగరమహారాజధానీ కర్ణాటకసింహాసనప్రతిష్ఠాపనాచార్య ... శ్రీవిరూపాక్ష శ్రీ విద్యాశంకరదేవదివ్య శ్రీపాదపద్మారాధక శ్రీమత్సచ్చిదానందాభినవోద్దండవిద్యారణ్య భారతీస్వామిగురు కరకమలసంజాత శ్రీమత్సచ్చిదానందాభినవశంకరభారతీస్వామిభిః

అస్మ దత్యంతప్రియశిష్య గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా జానపాడునామక గ్రామనివాసినాం జానపాటి పట్టాభిరామశాస్త్రిణాం విషయే నారాయణస్మరణపత్రికా.

శిష్యజనోద్ధారార్థమై మేము దేశసంచారము చేయుచు నిజామురాష్ట్రములో, ఆదలాబాదుజిల్లాగ్రామనివాసులు ... అగు ... శిష్యజనులు

శ్లో. చాతుర్మాస్యం యతీనాంతు యః కారయతి ధర్మవిత్
స యాత్యైహిక మైశ్వర్య మాముష్మికసుఖం మహత్.

అను స్మృతిప్రతిపాదిత ఫలము పొందఁదలఁచి చాతుర్మాస్యదీక్ష నీ (ఆదులా బాదు) గ్రామమున నిర్వర్తించుటకై ప్రార్థింప వారి ప్రార్థన నంగీకరించి ... దీక్షారంభము జేసి ... ఆజ్ఞాపించున దేమన– ఇచ్చట శ్రీదేవీ నిత్యపూజాపద్ధతియుఁ బ్రతి దినము శారీరకబ్రహ్మసూత్రభాష్యశ్రవణమును యథావకాశ పురాణశ్రవణాదులును... సంప్రదాయానుసారము జరుగుచుండును. మఱియు ... శంకర ... విద్యారణ్యశిష్య పరంపరలోఁ జేరిన మాగురు ... శ్రీ శ్రీ సచ్చిదానందాభినవోద్దండవిద్యారణ్యభారతీ స్వాములవారి వార్షికారాధన యూవృషసంవత్సర శ్రావణ బ ౩౦ ... పూర్వారాధన ... ఉత్తరారాధన ... ౧౩ ... మే మాపీఠమం దభిషిక్తుల మగుటచే ... వర్ధంతి మహోత్సవము జరుగఁగలవు గావున ... నాలుగురోజులు ... భక్తిశ్రద్ధలతో శ్రీ గురుప్రసాదమునకుఁ బాత్రులగుచు భాద్రపద శు ౧౫ కాఁబోవు విశ్వరూపయాత్రోత్సవమందుఁగూడఁ దీర్థప్రసాద వ్యాసాక్షతల స్వీకరించి శ్రీ ... అనుగ్రహమునకుఁ బాత్రులు కాఁగలరు. ఈ సం ... దేవీ శరన్నవరాత్రోత్సవముకూడ నీప్రాంతము ననే జరుగఁగలదు. అభిజ్ఞుల కింతకంటె వ్రాయ నగత్య మేమియున్నది ?

నివాసః, ఆదలాబాదు. ఇతి నారాయణస్మృతిః

వృష శ్రావణ శు ౨.

—()—

## —♦ జ్యోతిర్లత ♦—

(దైవజ్ఞరత్న సిద్ధాంతి చింతలపాటి సుందరరామశాస్త్రిగారు)

15-8-1941 మొదలు 20 వఱకు నచ్చటచ్చట గాలితోఁగూడిన ఖండ వృష్టి. కొలఁదిప్రదేశములలో ముసురు.

21 మొ. 27 వఱకు నంతటను వర్షము గురియును. గాలి విశేషించియుండును.

28 మొ. 1-9-41 వఱకునెండ మెండు. వాయువు మబ్బు. విశేషఖండవృష్టి.

2 మొ. 4 వఱకుఁ దుషారవృష్టి.

6 మొ. 9 వఱకు నచ్చటచ్చట నీదరగాలియు మబ్బు జల్లువర్షము, ఎండ.
10 మొ. 12 వఱకు విశేషమగు నెండలు.
13 మొ. 16 వఱకు విశేషముగ గాలి చలి యుండును.

ధరలు

15-8-41 మొ. 18 వఱకు ధాన్యము నూనె బెల్లము నల్లసరకుల ధర మాసాలునకు గొద్దిగా హెచ్చు.
19 మొ. 24 వఱకు నన్నిటికి హెచ్చుతగ్గుగా మాటి ధాన్యమునకు హెచ్చును.
25 మొ. 31 వఱకు నూనె ప్రత్తి నూలు విదేశవస్తువులకు గిరాకి.
1-9-41 మొ. 10 వఱకు నాముదము బెల్లము నువ్వులనూనె వేరుసెనగలకు గిరాకి.
11 మొ 16 వఱకు వస్త్రములు నూలు దూది పిండి వగైరా బాజారుదినుసులకు గిరాకి.

దేశ యోగములు

15-8-41 మొ. 21 వఱకు జనులకు రోగబాధ. గ్రహణి వగైరాలు కటస్థ మగును.
22 మొ. 31 వఱకు గలహములు నుపద్రవములు మెండు.
1-9-41 మొ. 6 వఱకు బ్రశాంతముగా నుందురు. జనుల కారోగ్యము. పశుపీడ.
7 మొ. 11 వఱకు సర్వారిష్టయోగము. ప్లేగువగైరాలవల్ల నష్టి.
12 మొ. 16 వఱకు నితరదేశములలో గలహములు నష్టి విశేషము. జనులలో నాతురత మెండు. ఆకస్మాన్మరణము లెక్కుడు.

---

## —♦ వ్యాసమహర్షి ♦—

(శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారు)

... వ్యాసుడు పాండవపక్షాభిమానముతో భారతమును వ్రాసెనని (పెండ్యాల సుబ్రహ్మణ్య) శాస్త్రిగారు వ్రాసియున్నారు.

... పాండవపక్షాభిమానముతో ... వ్రాసినచో ... నియోగపద్ధతిచే నైన పాండవోత్పత్తి హస్తిపురి కేతెంచిన పాండవులం జూచి కొంద అనుమానించిరనుట ... ద్రోణయుద్ధమునందు ధర్మజుని పలాయనము ... ధర్మజ భీమ నకులసహదేవుల పరాభవము ... యాదవకాంతలను గాపాడుటలో బార్థుని యశక్తత ... పాండవ నరక లోకగమనము మున్నగువిషయములను వ్యాసుం డేలవ్రాయవలయును? ... తత్పక్షానుకూలముగా వ్రాయలేకపోయెనా? ... పాండురాజున కౌరసపుత్రులని ... యావద్గ్రంథము బాండవోత్కర్షతో వ్రాసినచో గాదనువా డెవ్వడు? ...

... వ్యాస కృష్ణ పాండవ భీష్మ ద్రోణాది భారతవీరులు శాస్త్రిగారి కెంత ... హాస్యాస్పదులుగా గనబడుచున్నను బ్రాహ్మణులైన పురాతనాధునాతన దేశీయపండితుల చేతను ... పాశ్చాత్యవిద్వాంసులచేతను ... పొగడ్త గాంచుచున్నారు.

శాస్త్రిగారు ... వ్యాస శుక శౌనక వైశంపాయనాదుల ... భ్రష్టబ్రాహ్మణులం జేసియున్నారు ... నిరర్థకమైన గొడవ వ్రాసి యజ్ఞానులకు భ్రమ గల్పించు

చున్నారు ... నవనాగరికులకుమాత్రి మీ ... విమర్శ యత్యంతోపయోగ మగుచున్నది. భారతమున కజ్ఞానులైన యితరు లెవ్వరో వ్రాసిన విమర్శలం జూచి ... భగవంతుండైన కృష్ణుని వ్యాసాది దివ్యమహర్షులను ... ధర్మరాజా ద్యుత్తమసామ్రాజ్యాధీశులను విదురసంజయాది రాజ్యాంగవేత్తలను గుంతీ ద్రౌపద్యాది మహాపతివ్రతలను నిందింపఁగూడదు. ... మనకుఁ దెలియనివిషయము లనేకములు గలవు ... సరిగా గ్రహింపక ... దుర్వాదముల కెడమీయఁగూడదు.

... సంకీర్ణసంభవుఁడని ... కులహీనుఁడని ... దుర్యోధనాదులైనను లేక తత్పక్షీయులలో నొక్కఁడైనను వ్యాసుని నిరసింపలేదు. రాజసూయమునఁ గృష్ణభీష్మాదుల ద్వేషించిన శిశుపాలుఁడుగూడ వ్యాసుని బూజింపఁదగిన బుత్విగ్గణములో నొక్కనిఁగాఁ జేర్కొనియున్నాఁడు. ... విశ్వామిత్రునకు వాల్మీకిమహర్షికి బ్రహ్మత్వము శ్రీమద్రామాయణ మెట్లంగీకరించెనో యట్లే వ్యాసునకు వేదములు భారతము నంగీకరించుచున్నవి. ఆకాలమునుండి నేఁటివఱకు ... లోక మంగీకరించుచున్నది ... శ్రీమన్నారాయణుని యవతారమని ... సమస్తగ్రంథములు చెప్పుచున్నవి ... లోకము వ్యాసపూజ చేయుచున్నది ... శాస్త్రిగారు వినాగా మఱియొక రెవ్వరు నీవిషయ మిట్లు నుడివినవారు లేరు ... వ్యాసుని ... గుణదోషముల నాకాలపుఁ బ్రజలే నిర్ణయింపవలెను గాని మన కెంతమాత్రము నర్హతలేదు. రాజసూయాశ్వమేధముల కాహూతులైన బ్రాహ్మణులు మహర్షులు మహారాజులు వ్యాసార్త్విజ్య మనంగీకారమని నుడువలేదు ... నిశ్శంకముగాఁ జెప్పవలసిన వాక్యమును జెప్పక ముఖప్రీతివాక్యములం జెప్పుటకది కాలము గాదు ... కావున వ్యాసుఁడు సంకీర్ణసంభవుఁడు గాఁడు.

... శక్తిమహాముని తనయుఁడైన పరాశరుఁ డుత్తమబ్రాహ్మణుఁడు. మత్స్యగంధి ... క్షత్రియకన్య. ఈసంబంధముచే ... యుక్తసంతానమే కలుగవలెను ...

వ్యాసుఁడు మహామహిమాన్వితుఁడైన బ్రాహ్మణతపస్వి గాని సంకీర్ణసంభవుఁడు కాఁ డనుటలో సంశయము లేదు.

...శాస్త్రిగారు...భారతము చదువుట కసహ్యత గలుగునని...వ్రాసియున్నారు.

లోకములో ననేకులు భారతమును ధర్మశాస్త్రమనియు నర్థశాస్త్రమనియు మోక్షశాస్త్రమనియు ... పఠించుచున్నారు ... తదనుకూలఫలము లభించుచునేయున్నది... శాస్త్రిగా రాముష్మికమునకై యవలంబించిన యడియాసలను మాని ... పెద్దల సేవఁ జేసి సత్పాండిత్య మలవఱచుకొనవలయును ... తన పాపకర్మకుఁ బశ్చాత్తాపము వహించినచో నాముష్మికము కరతలామలక మగును. ఇప్పటికైనను శాస్త్రిగారీర్ష్యాభిమానములను వహించి కట్టును విడుచు టవమానకరమని దురాగ్రహముచే ఖండనముండనములకుఁ బ్రయత్నింపకుందురు గాక...

---

## —♦ నూజవీటిసంస్థానములు ♦—

(పెద్దిభట్ల వీరయ్యగారు, బి. యే., బి. యల్.)

హిందూదేశము స్వదేశరాజుల పరిపాలనలో నున్నకాలమందును మహమ్మదీయుల ప్రభుత్వమునందును దేశముఖులనియుం జమీందారులనియుఁ బిల్వఁబడువారు కొంతభాగ

మున కధికారులుగా నుండి సిస్తు వసూలుపఱచుచుండెడివారు. కొందఱు వసూలుచేసిన సిస్తులోఁ గొంతభాగమున కధికారముగలిగియుండిరి. హిందూరాజులేమి, మహమ్మదీయ ప్రభువులేమి, జమీందారులకు సావరముభూముల నిచ్చుచుండిరి, వీరు నితరుల కగ్రహార ములు నీనాములు మొఖాసాలు నిచ్చుచుండిరి. ఆంగ్లేయులు చెన్నరాజధానిలోఁ బ్రవేశముగలిగించుకొనఁగలిగినకాలమున ఉత్తరసర్కారులనఁబడు తెనుఁగుదేశమున రాజమండ్రిసర్కారు కొండపల్లిసర్కారు గుంటూరుసర్కారు మొదలగు పేళ్లతోఁ గొన్ని ...కలవు. కొండపల్లిసర్కారును ముస్తఫానగరమనియుం గుంటూరుసర్కారును మృత్తుజానగరమనియుఁ బిలుచుచుండెడివారు. గుంటూరుసర్కారుతోఁ జేరి యుత్తరముగానున్న యయిదుసర్కారులు నుత్తరసర్కారులని పిలువఁబడుచుండెడివి. నూజవీటి జమీందారి కొండపల్లిసర్కారు (కృష్ణాజిల్లా)లోఁ జేరినది. 1768 సంవత్సరమునాఁటికి హైదరాబాదునవాబు పరిపాలనలో నుత్తరసర్కారు లుండెను. అందు గుంటూరుసర్కారు నిజాముకు సోదరుఁడగు బజాలతుజంగు జాగీరుగా జీవితకాలపు హక్కుతో ననుభవించుచుండెను.

1768 సం॥ లోఁ గంపెనివారు నిజాముతోఁ జేసికొన్న సంధిప్రకార ముత్తర సర్కారు లాంగ్లేయప్రభుత్వముక్రిందికి వచ్చెను ... బజాలతుజంగు 1782 ... లోఁ గాలముచేసినను 1788 వఱకు గుంటూరుసర్కారు లాంగ్లేయుల యధీనము కాలేదు. సంధిప్రకారము 1828 సం॥ వఱకు నాంగ్లేయులు నిజాముకుఁ బ్రతి సం॥ 7 లక్షల వరహాల పేష్కషు నుత్తరసర్కారులు స్వాధీనమం దున్నందులకుఁ జెల్లించుచుండెడివారు. అంత నొక్కసారి 1200 లక్షల వరహాలను నిజాముకుఁ జెల్లించి శాశ్వతముగాఁ బేష్కషురహితముగ నాంగ్లేయప్రభుత్వమువా రుత్తరసర్కారుల కధికారులైరి. సర్కారు లాంగ్లేయుల వశము కాకపూర్వము జమీందార్ల కుండిన స్వేచ్ఛ తర్వాత లేదు. మహమ్మదీయపరిపాలనలో జమీందారులే సమస్తమైన హక్కులను జలాయించుచుండిరి ...సాధారణముగా హక్కు లేనప్పటికి జమీందారులు విచ్చలవిడిగా ననేకాగ్రహార ములు నీనాములు నిచ్చియుండిరి. 1768 ... తర్వాత ... సావరముభూములనుండి యీయఁబడినఁ దప్ప నాంగ్లేయప్రభుత్వమువారు కొన్ని నిర్బంధములను గలిగింపసాగిరి. నూజవీటిజమీందారి ప్రథమమున మేకా బసవన్నయనువారికి మహమ్మదీయప్రభువుల వల్ల నీయఁబడినది. వారి వంశజులు నూఱు సం॥ లకుఁ బైఁగా ననేకములైన మార్పులకు లోఁబడి పరిపాలించుచుండిరి. ఆంగ్లేయులు రాకపూర్వము మహమ్మదీయులకును జమీందారువంశస్థులకును గలిగిన వివాదములు చాలఁగలవు. ఈజమీందారులలో నప్పారాయ బిరుదమును నిజామువల్లఁ బొందిన విజయాప్పారావుబహదరును ధర్మాప్పారావని పేరు పొందిన నృసింహాప్పారావుబహదరును గలరు. వీరికాలమందే యనేకాగ్రహారములును నీనాములును నేర్పడినవి. కొందఱు జమీందారులు సైన్యముగలిగియుండి యుద్ధములుసేసిరి. జమీందారిని గోల్పోయి తిరిగి రాఁబట్టుకొనుటయుం సంభవించినది. ఆంగ్లేయులు నిజాముతో సంధిచేసికొను 1768 సం॥ నాఁటికి నూజివీడు నిడదవోలు జమీలఁ బరిపాలించునది శ్రీ రాజా మేకా వేంకటాద్ర్యప్పారావుబహదరు...గారు. వీరు 1772

...లోఁ గాలధర్మమునొందిరి. వీరి కొమరులగు శ్రీ రాజా నారయ్యాప్పారావుబహాదరు గారు 1783 ... వఱకు జమీందారులుగా నుండిరి. అప్పటిలో వారికిని నాంగ్లేయుల గవర్నమెంటువారికిని కలహము పొసంగినందువలన ... జమీందారిని ... స్వాధీన పఱచుకొనిరి. కాని మరుసటి సం॥ (1784) లో ... తిరిగి ... నారయప్పారావు బహద్దరుగారి జ్యేష్ఠకుమారులగు వేంకటనరసింహాప్పారావు ... గారి కధీనపఱచిరి ... 1793 ... నాఁటికి ... పేష్కషు బాకిపడినందునఁ దిరిగి గవర్నమెంటువారు జమీందారిని స్వాధీనపఱచుకొనిరి.

1302 ... లో జమీందారులతో నాంగ్లేయప్రభుత్వమువారు శాశ్వతపు సెటిల్మెంటు నిర్మాణముచేసికొనినప్పు డప్పటివఱకు నొకటిగానుండిన నూజవీడు నిడదవోలు జమీందారిని రెండుభాగములు చేసి చిన్నభాగమగు నూజవీడుజమీందారిని నారయ్యాప్పారావు ... గారి రెండవకొమరులగు రామచంద్రాప్పారావు ... గారికిని పెద్దభాగమగు నిడదవోలుజమీందారిని ... వేంకటనరసింహాప్పారావు ... గారికిని సన్నదు లీఁబడినవి. నారయ్యాప్పారావు ... గారి మూఁడవకుమారులగు నరసింహాప్పారావు ... గారు 1816 ... లోఁ దమకు మూఁడవవంతు రావలెనని ... దావా తెచ్చి క్రిందికోర్టులో భాగము...ను బొందఁగా సదరదాలతుకోర్టువారు గవర్నమెంటువారు జమీందారిని స్వాధీనపఱచుకొని తిరిగి వారి యిష్టమువచ్చినవారి కిచ్చినందున నరసింహాప్పారావు...గారికి భాగములేదని తీర్పునిచ్చిరి. తర్వాత నరసింహాప్పారావు... గారు కాలముచేసిరి. వారిసంతతివారికిఁ బై యిరువురు జమీందారులును కొంతకాలము రొక్కమును బిమ్మటఁ గొన్ని గ్రామముల నిచ్చి సమాధానపఱచుకొనిరి. వెంకటనరసింహాప్పారావు...గారు 1864...లోఁ గాలముఁజేసిరి ... వారి కిరువురు భార్యలు. ...పెద్దభార్య నరసింహాప్పారావు ... గారి కొమారులలో నొకరగు నారయప్పారావు ...గారిని దత్తుచేసికొనెను. నారయ్యప్పారావుగారి యనంతరము వారిభార్య పాపమ్మారావు ... గారు 1899 ... వఱకు జమీందారిణిగా నుండి కాలముచేసెను. ఈరాణిగారివద్ద మాడపాటి వెంకటేశ్వరరావుపంతులుగారు చాలకాలము దివానుగానుండిరి. ఈ జమీందారిణి యనంతరము నిడదవోలుజమీందారి రామచంద్రాప్పారావుగారి సంతతివారికే ... సంక్రమించవలెనని ప్రీవీకౌన్సిలువఱకు వ్యాజ్యెములు జరిగినవి. ప్రస్తుతము నిడదవోలుజమీందారి నూజవీటిజమీందారులలోఁ జేరిన వేంకటాద్రిప్పారావుబహాదరుగారి కొకభాగమును వేంకటరామయ్యాప్పారావు ... గారికిని శోభనాద్రిప్పారావుగారికిని సగభాగమును నరసింహాప్పారావుబహాదరు సంతతిలోఁ జేరిన పార్థసారథ్యాప్పారావు ... గారి కొకభాగమును వచ్చినవి ... వెంకటరామయ్యాప్పారావు ... గారి యాఱవవంతుకు మేడూరు యెష్టేటు రాఁగా వారి మైనరుకుమారులగు నారయ్యాప్పారావు ... గారు పాపమ్మారావు ... గారిచేత దత్తస్వీకారముచేయఁబడి ... బాల్యముననే మృతులగుటచే మేడూరి యెష్టేటుకూడఁ బాపమ్మారావు ... గారికి సంక్రమించి యామెయనంతరము ప్రీవీకౌన్సిలువఱకు వ్యాజ్యెముజరిగి దత్తత చెల్లదని తీర్మానమై ... ఉయ్యూరుజమీందారి కొకభాగమును మీర్జాపురము యలమఱ్ఱుజమీందారుల కొకభాగమును రాఁబడినవి. పాపమ్మారావు ... గారు శనివారపు, పేటలో నుండి

యనేకరాజబంధువులఁ బోషించుచు రొక్కము నగలుఁ గాక కొన్ని గ్రామములను గొనియిచ్చియుండెను ... మరణానంతరము వారి రొక్కము నగలుఁ జాలవఱకు నితరులు కాఁజేయుట తటస్థించినది.

రామచంద్రాప్పారావు ... గారు కాలముచేసిన పిమ్మట నూజవీడు జమీందారి వారి యేకపుత్రులగు శోభనాద్ర్యప్పారావు...గా...రు 1866 వఱకు నెట్టియాటంకములు లేకుండఁ బరిపాలించుచుండిరి ... వారి కాఱుగురు కొమాళ్లు ... వారిలోఁ జ్యేష్ఠుఁడగు నారయ్యప్పారావు ... గారికిని దండ్రికిని వివాదలు ప్రారంభమైనవి. శోభనాద్ర్యప్పారావు ... గారు విరివిగ ఖర్చుచేయుచు జమీందారిని సరియైన పద్ధతినుండి తప్పించుచుండినందునఁ గొమాళ్లకు ... పంచియిప్పించవలసినదిగా 1867 ... లోఁ గలెక్టరుగారిని గోరిరి ... 1888 ... లో శోభనాద్ర్యప్పారావు ... గారు కాలధర్మముఁజెందిరి ... జమీందారి ... జ్యేష్ఠునకే సంక్రమించుచుండిన యాచారము ననుసరించి కలెక్టరుగారు జ్యేష్ఠులగు నారయప్పారావు ... గారికి ... స్వాధీనపఱచిరి. 1868 మొదలు 71 ... వఱకు ... తృతీయపుత్రులగు వెంకటనరసింహాప్పారావు ... గారు గవర్నమెంటువారికిఁ బంపిన నిమిత్తము పంపిన యర్జీలు వ్యర్థమైనందున ... వ్యాజ్యము దాఖలుచేసిరి. ఈదావా జిల్లాకోర్టులోను ... హైకోర్టులోను వాదికి వ్యతిరేకమై ప్రివీకౌన్సిలు కపీలుచేయఁబడినది. ఇంతలో నారయప్పారావు ... గారు మృతిఁజెందిరి. వారి పెద్దకుమారుని పక్షమునఁ గోర్టాఫ్‌వార్డ్సువారు ... ప్రివీకౌన్సిలువ్యాజ్యమును నడపిరి. అక్కడ 1802 ... లో జమీందారి గవర్నమెంటువారివల్ల నీయఁబడిన కారణముచేత నదివఱకుండిన యవిభాజ్యలక్షణమును గోల్పోయినదని ... ఆయి భాగములుగా విభజింపఁబడుటకుఁ దీర్పుగలిగెను. కోర్టాఫ్‌వార్డ్సు కాలమందు బాదరు వాస్తవ్యులు సింగరాజు సుబ్బారాయఁడుపంతులుగారు ... మేనేజిమెంటు చేయుచుండిరి... 1882 సం॥ నాటికి విభాగము పూర్ణమైనది. శోభనాద్ర్యప్పారావు ... గారి జ్యేష్ఠకుమారులగు నారయప్పారావుబహద్దరుగారి ముగ్గురుపుత్రులగు రాజగోపాలాప్పారావు ... గారు రామచంద్రాప్పారావు ... గారు వరదరాజాప్పారావు ... గార్లకొక భాగమును తృతీయకుమారులగు వెంకటనరసింహాప్పారావు ... గారి కొకభాగమును ద్వితీయకుమారులగు రంగయ్యాప్పారావు ... గారి కొకభాగమును నాల్గవకొమరులగు సింహాద్ర్యప్పారావు ... గారి కొకభాగమును నయిదవకొమారులగు వెంకటాద్ర్యప్పారావు...గారి కుమారులగు వేంకటరంగయ్యప్పారావు.. గారి కొకభాగమును నాఱవకొమరులగు వెంకటరామయప్పారావు...గారి కొకభాగమును వచ్చినవి. ఈవెంకటరామయప్పారావుగారి కొమారునే ... పాపమ్మారావు...గారు దత్తుచేసికొనుట సంభవించినది. .. నూజివీటిజమీందారివంశము మొదటినుంచి ధర్మములకుఁ బ్రఖ్యాతిగాంచినది. అందుకు నిదర్శనముగా జమీందారీలోఁ జేరిన మొఖాసాలు నగ్రహారములు నీనాములుఁ జెప్పఁగలవు. పూర్వపు జమీందారులలో నరసింహాప్పారావు ... (ధర్మాప్పారావు)గారి ధర్మము లనేకము. రంగయప్పారావు ... గారు బెజవాడలో ... సత్ర మేర్పాటుచేసి కొంతభూమి నిచ్చిరి. వారి కొమరులగు వెంకటాద్ర్యప్పారావుబహద్దరుగారు సత్రమునకు విశాలమైన స్థలము నేర్పాటుచేసి భూములమీఁద హెచ్చయినజు దాఁగల యేర్పాట్లను






స్థిరముగాఁ జేసిరి. ఇదిగాక నూజివీడు హైస్కూలు నిమిత్తము మంథెన వేలేరు గ్రామములను రంగయప్పారావు ... గారు దానముచేసియున్నారు. ఒకప్పుడు రంగయప్పారావు ... గారి వద్ద కొక నౌకరు ధాన్యము దొంగిలించినటుల రిపోర్టు చేయఁబడఁగా వందలకొలఁది జీతములు తీసికొనుచు జమీందారిసొమ్ము కాఁజేయువారి సంగతి తలంపక యన్నమునకు లేక ధాన్యమును దీసికొన్నవాఁడు మీకుఁ జిక్కినాఁడాయని మందలించినటులఁ దెలియుచున్నది. ఈరాజాగారి యౌదార్యము మెండు. వీరికొమారులగు వెంకటాద్రిప్పారావుబహాదరుగారు రాంగ్లమునఁ బరీక్షల నిచ్చి యాంధ్రమునఁ బాండిత్యము కలిగిన సిగర్వచూడామణులు ... వేంకటరంగయప్పారావు ... గారు సత్కథాకాలక్షేపము చేయుచు మిక్కిలి దైవభక్తితోఁ గాలము గడపుచుందురు. ... ఇప్పటికి నాంగ్లేయవిద్య చెన్నపురిలోఁ దల్లవారి సాంగత్యమున నభ్యసించి కొందఱు చెన్నపట్టణములో నుండుచున్నను ... ఇష్టదైవమగు నాకిరిపల్లి శోభనాచలపతియందు భక్తిగలవారై వంతులవరుసను క్రమముగా నుత్సవాదులను జరిపించుచున్నారు. ఆకిరిపల్లిలో నన్న సంస్కృతవేదపాఠశాలయు జమీందారుల పోషణలో నుండునెడల మిక్కిలి బాగుగ నుండును. తిరుపతి కొచ్చి మొదలగుచోట్ల నిట్టి పాఠశాలలను దేవాలయముల ధర్మకర్తలే నిర్వహించుచున్నారు. నూజివీటిజమీందారి ... చిన్నచిన్న భాగము లేర్పడుటవల్లఁ బూర్వపు టౌన్నత్యము తగ్గుచున్నది. ఇటీవల నుయ్యూరు యస్టేటు ... వేంకటాద్రిప్పారావుబహాదరుగారు ... అవిభాజ్యపు యస్టేటులలోఁ జేర్పించిరి. ఇటీవలఁ గొన్ని గ్రామము ల ప్పారావువంశమునుండి... చీలిపోవు చున్నవి.

ఈజమీందారి పాలనలో ... ఇటీవలివారిలో ... మాడపాటి వెంకటేశ్వరరావుగారు మొదలగువారు ముఖ్యులు ... దానకర్ణులని ఖ్యాతిగాంచి ... వీరందఱును జమీందారులు చేయు ధర్మకార్యములలో దగుసలహా నిచ్చి ప్రజారంజకులుగ నుండిరి. మాడపాటి వేంకటేశ్వరరావుగారు రంగయప్పారావు ... గారివద్దను బాపమ్మారావు... గారివద్దను జాలకాలము దివానుగా నుండి వారిచేఁ జేయించిన ధర్మములు కాక స్వయముగ 4 లక్షల రూపాయల యాస్తి దానము చేయుచు మరణశాసనము వ్రాసి కాలము చేసిరి. నూజివీటిసంస్థానాధీశుల ద్రవ్యము స్వహస్త పరహస్తముల ద్వారముగఁ గృష్ణాజిల్లాలోని యనేకకుటుంబముల కుపయోగపడుచుండుటయు వారివంశము ... కాశీ మొదలగు స్థలములందు ధర్మాప్పారావువంశముగఁ బరిగణింపఁబడుటయుఁ గలదు. ప్రస్తుతపు జమీందారు లందఱును బూర్వుల మార్గముననే సంచరించి సంస్థానము కీర్తిగాంచుటకై సర్వేశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యము లొసంగుఁ గాత!

## —♦ మాణిక్యప్రభు చరిత్రము ♦—

( శేషాద్రిరమణకవులు )

మహారాష్ట్రదేశమున భక్తులు పెక్కండ్రు గలరు. అందు ... మాణిక్యప్రభుజీవిత మొక్కటి. ఈప్రభువు భావనుమహానీయుఁడు మూలపురుషుఁడుగా మహారాష్ట్రబ్రాహ్మణవంశములో ఋగ్వేద ... శ్రీవత్సగోత్రమునకు సంబంధించిన యుత్తమవంశములో నుద్భవించెను. జన్మస్థానము నిజామురాష్ట్రమునందలి గుల్బర్గాకు ముప్పదిమైళ్ల దూరములో నున్న కల్యాణపురమునకు సమీపమునఁ గల లాడవంతి. ఒకపుణ్యదంపతుల

కీప్రభువు దత్తాత్రేయాంశమున శా॥ ౧౭౪౩ మార్గశీర్ష శు ౧౪ జన్మించెను ... ఈయన కొంతకాలము ... కల్యాణపురప్రాంతములో షాయిరీ గుమాస్తాగా నుండి ప్రభుత్వాదాయము ధర్మార్థముగా వినియోగించి ... రాజకీయమునుండి బయటఁబడెను ...

తరువాత ... శాస్త్ర ... జ్ఞానము సార్జించి గృహస్థాశ్రమము స్వీకరింపక కల్యాణపురమున ... అతిథ్యభ్యాగతులకు లేదనకుండ నన్నదానము గావించుచుండ ... అన్నపూర్ణాదేవి ... ఒక కఱ్ఱయుఁ జోలియుఁ సమర్పించెను. వీనిసహాయమున ... ధర్మకార్యములు విరివిగా సాగించి యశమార్జించెను. ఈత్యాగి కీశ్వరుఁడు జంగమువలెఁ బ్రత్యక్షమై రెండు రుద్రాక్ష లేకముఖివి యొసంగెను. అంత ... తన్నాశ్రయించిన వారికిఁ దత్త్వోపదేశము గావించుచుఁ జిద్విలాసముల నెఱుంగఁజేయుచు భవిష్యత్తుల నెఱింగించుచు ... కలియుగదైవతముగా వర్తించెను. బోధ సర్వసమమగుచు నుంటచేఁ బెక్కుండ్రుమహమ్మదీయు లీతని మతములోఁ జేరసాగిరి. మతావేశపరవశు ... లది యెఱుంగక ... మతసంగ్రామము గావించి యాతనివలన ఖురానులోని రహస్యములు గ్రహించి యానందపరవశులై ...రి. పెక్కుమందికి మోక్షధర్మము లుపదేశించి మాణిక్యప్రభుఁడు తీర్థయాత్రలు గావించి దివ్యక్షేత్రములు దర్శించి కొంతకాలము గాసుగాపురములోనుండి పిదప బీదరులో గొప్ప మఠము స్థాపించెను. పిదపఁ బల్లకి నెక్కి ... కల్యాణికిఁ బోవుచుండఁ బాలకీ కల్యాణికి మధ్య సిద్ధులు ప్రభునకుఁ బ్రత్యక్షమై యటనే మఠముగట్టుకొని నివసింపుమని యాజ్ఞ యొసంగుటచేఁ జిరకాల మట వసించెను ... దైవాంశ గ్రహించి దేశవాసులు వేలకొలఁది కానుక లీయసాగిరి. దీనిసహాయముతో నీమహాత్ముఁడు ధర్మకార్యములు సంతర్పణలుఁ గావించుచుఁ బలుమాఱు దేశముల ముట్టడించు రోహిలాలను సత్కరించి దోపిడుల మానిపించెను ... ఈ ... తేజము దేశము నంతయుఁ బ్రాకరించుటచే దూరస్థులు సమీపవాసులు మ్రొక్కుఁబడులు చెల్లించుచు భక్తులై వర్తింపసాగిరి. ప్రభువునకు ధర్మాదాయము వేలకొలఁది రాసాగెను. స్వయముగా మధ్యాహ్నము ప్రభుపర్యఁ డన్నపూర్ణాదత్తములగు జోలి దండముఁ గొని పోవ దేవాలయములలోని విగ్రహములు భిక్ష పెట్టసాగెను. తన యాదాయము పండితసత్కారములకు సత్రములకు నన్నదానమునకు వినియోగించి దైవదత్తమగు తన యమానుషశక్తి లోకమునఁ బలుమాఱు సాటి లీలావతారుఁడని పేరువడసి యీమహాత్ముఁడు 1865 డిసెంబరులో సమాధిఁ జేరెను. ఈమహాత్ముని పేరుతో జన్మస్థలమగు లాడవంతిలో ... ఇంకను బెక్కుచోటుల ... మఠములుగలవు. ఈమహనీయుఁడు సిద్ధిపొందిన స్థలమున గొప్ప సమాధియుఁ మఠముఁ గలదు. అచట సత్రమున్నైతము గలదు. ఈమఠమున కిప్పటికిని వేలకొలఁది యాదాయము వచ్చుచున్నది. ఈమఠ మొక సంస్థానమువలె నుండును. ఇటనుండు నుద్యోగులకు నెలకు నాలుగైదువందలరూప్యములు వేతనముగా నీయఁబడుచున్నవి. ప్రతివత్సరము మార్గశీర్ష శు ౧౧ మొదలుకొని చతుర్దశివఱ కుత్సవములు జరుగుచున్నవి. ఈ...మఠమునకు వచ్చు ప్రతివత్సరాదాయము ... ధర్మార్థముగా వినియోగింపఁబడుచున్నది. ఉత్సవార్థము వచ్చు భక్తసమూహమునకు మితిలేదు. మాణిక్యప్రభు పేరుతో నిజామురాష్ట్రమునఁ బెక్కుచోటుల మఠములు గలవు. ఆమఠములలోఁ బూజలు జరుపఁబడుచు వైభవోపేతముగా నున్నవి....

## నిశ్చయబుద్ధి కష్టసహనములు

(తాను నిజమని యెఱింగిన యంశమును జెప్పుటకును బుద్ధి చెప్పుటకును సంశయాస్పదముగ నుండకుండునట్లుగా మఱది కుమారయ్యకుఁ గృష్ణాబాయి నేర్పియుంచెను. కుమారయ్య బడిపంతు లొకనాఁ డొకనోటిలెక్క యడిగెను. అగ్రస్థాన మలంకరించిన యొకబాలుఁడు సరియగు జవాబిచ్చెను. కాని యుపాధ్యాయుఁ డంతట నిలువక తరువాతవాని నడిగెను. కుమారయ్య సరియగు జవాబిచ్చెను గాని యుపాధ్యాయుఁడు దిగువబాలుర నడుగుచుండెను.

కుమా:- మీప్రశ్నకు నాయుత్తరమే సరియైనది.

ఉపా:- అటులయిన నీ వగ్రస్థానమున కరుగుము.

ప్రథమము సరిగఁ జెప్పిన బాలుఁడు:- నేనును గుమారయ్య చెప్పిన యుత్తరమునే చెప్పితిని. మీ రంగీకరించరైతిరి.

ఉపా:- చెప్పితివి. నే నావలబాలుర నడుగుచుండిన సంశయించి యూరకుంటివి. అందువలన నీ కది ధ్రువముగఁ దెలియదని నిశ్చయించితిని. ఇఁక నెన్నఁడేని నీ వెఱిఁగిన యంశము ప్రకటించుటలో సంశయము వదలుచుండవలెను. న్యాయవర్తనమును నిశ్చయబుద్ధియుఁ గలవానికిఁ బంచభూతములు సహాకారము లగుచుండును.

(కామేపల్లియను గ్రామమున నొక బ్రాహ్మణుఁడు బావిద్రవ్వ నిశ్చయప్రారంభ మొనరించి పూర్తికావింపఁగలిగెను. చూచితిరా బుద్ధిబలముయొక్కయుఁ బట్టుదలయొక్కయు మాహాత్మ్య మెంతెంత కార్యములఁ గొనసాగింపఁగలిగియుండునో. చిన్నతనమునుండియుఁ బట్టుదల నవలంబించినవారి దృఢచిత్తుల నొనరింపుము.

ఒక వేఁగులవాఁడు పరరాజుచేఁ బట్టుపడెను. ఆచటి యుద్ధనియమముల ననుసరించి వీనికి మరణదండన విధింపఁబడెడిది. అతఁ డీసంగతి నెఱిఁగియుండెను గావునఁ జెవిటి మూఁగవలె నటించ నారంభించి యెన్నివిధములఁ బరికించినను దన పట్టుదల విడువకుండెను. తుదకు మరణము విధించితిమనినను మన్నించితిమనినను నేమియుఁ దెలియనివానివలె నటించి శత్రువుల నమ్మించి ప్రాణరక్షణ మొనరించుకొని పోయి తన్నేలినవారి కీయంశము తెలియపఱచెను. శిశువుల కట్టి పట్టుదలకలవారి కథల నుడివి వారి కోమలహృదయముల నట్టి బీజములు నాఁటునట్లు బోధించుట తలిదండ్రుల ముఖ్యకర్తవ్యము.

మానవపరమార్థము సుఖాపేక్షయే కాని యది లభించు మార్గ మరయఁగలవారలు కొలఁదిమందిమాత్ర ముందురని చెప్పవచ్చును. సుఖము పడయఁగోరువా రెల్లను గష్టము చేయు నలవాటు కలిగించుకొనవలెను. మూలుగుచు నుత్సవవిగ్రహమువలె నలంకరించు

కాని పనుల కెడఁదొలఁగువారల కేమాత్రము సుఖము సమకూరుట దుస్తరము. ఎట్టివారి సిరి వరించునని ఋషిపుంగవులు వచించిరో తెలిసికొని యాలక్షణములఁ దమయం దలవఱచుకొనినవారిలో నదృష్టవంతులు కానివారు లేరని విచారించిన ధ్రువపడఁగలదు. పాటుపడువాని కదృష్టముపట్టుట సామాన్యము. లోకమున నెవరికేని యూఁక దుదృష్టము పట్టుట కల్ల. ఏ యితరకారణములచేతనైన నైశ్వర్యప్రాప్తి కలిగిన నది నిలిచి సుఖప్రదమగు ననుభవమునకు రాకుండఁ దొలఁగిపోవుట సామాన్యము. పాటుపడువాని నదృష్టదేవత వలచి పెనుచును. అట్టివారల మనఁబుల కేకొఱఁతలు నంటక నిత్యసంతుష్టి పొదలుచుండును. వారికి దురాలోచనల కెడము కలుగదు. అదృష్టమును నమ్మినవారికి వలె నాశాభంగము కలుగదు. కాన వార లుల్లాసముగఁ ఋసులు దప్పులుకొనఁగలిగి యుందురు. కావునఁ బసితనమునుండియు గాలియెండల కోర్చి సంచరించునట్టుల నలవాటుపఱచవలెను. అట్లలవడినపిల్లలు సామాన్యశీతవాతములకు లొంగక దృఢగాత్రులై దీర్ఘాయుర్భాగ్యములు కలిగి వర్ధిల్లఁగలరు. చాలకాలము నీటియందుఁగడపు జాలరులును రజకులును శీతాతపముల నోర్చఁగలిగి యుండుటయుఁ గర్షకుల శిశువులు పొలములం దిరిగినను జలుబుకాఁకల నలఁగకుండుటయు నిందుకుఁ దార్కాణము. పాటుపడుచుండినను గాలియెండలం దిరిగినను పోటుపాటు దుమరని యట్లు తిరుగనీయక బిడ్డలం బెంచు తలిదండ్రులు బలహీనులుగను, రోగిష్ఠులుగను నల్పాయుష్కులుగను నొనరించుచున్నారని గ్రహింపవలెను. ముఖ్యముగ నైశ్వర్యవంతులును సంతాన మమితము కలవారు నీ రహస్యము నెఱిఁగియుండు టవసరము.

తల్లి పనిచేయునపుడు చిన్నచిన్నవస్తువు లందిచ్చునట్టును దండ్రి యలసి యింటి కరుదెంచినపుడు గొడుగు మొదలగు సాధనములఁ బదిలపఱచి నీరము మొదలగునవి యందిచ్చునట్లును నేర్పి పనియం దభిరుచి కలిగింపవలెను. తలిదండ్రులు పనిచేయునపుడు తమపిల్లలు తోడ్పడునట్లు ప్రోత్సాహపఱచుచుండఁదగుమాత్రము పనులఁ జేయింపవలెను. కాని శ్రమ నందఁగలరని వారించుటగాని వార లలయున ట్లధికశ్రమ కలిగించుటకాని కూడదు.

నిరుపేదరాలగు నొకయువతికిఁ బుత్రసంతతి కలిగిన కొలఁదిదినములకే కుటుంబమును బోషించుభర్త మృతి నందెను. కాని యామె కుటుంబమునకు లోటురానీయక పాటుపడుచు సుతునకు విద్యాబుద్ధులం జెప్పించుచు నతనికి వయసువచ్చునాఁటికి ధనికురాలయ్యెను. ఇరుగుపొరుగువారెల్లరు నామెకుఁ బరసవేది లభించినదని తలపోయుచుండిరి. ఆమె యైశ్వర్యమున కబ్బురపడుచుండిన యొకరిత యామె నాశ్రయించి తన కాబాగుపడుమార్గము తెల్పుమని ప్రార్థించెను. కాలాతిక్రమణము కానీక నిర్ణయించుకొనిన పను లెప్పటి కప్పుడు నిర్వర్తించి స్వయంకృషిచే నభివృద్ధి పడఁగలిగితినని నివేదించి నీకున్న నలువదివత్సరములం దిరుగఁగోడులు వ్యర్థమయినవని విచారపడుచుంటివనియు నిప్పటికేని సోమరితనము మాని పాటుపడఁగలవేని బాగుపడఁగలవని విప్పిచెప్పియు లోకమునఁ బేరుప్రతిష్ఠలఁ గాంచినవారెల్లరును బట్టుదల కలిగి పను లొనరించినవారలే యనియుఁ జెప్పి యీక్రింది సమాచారమును వినిపించెను.

"మన ప్రభుత్వము వారి జన్మభూమియగు నింగ్లాండునందుఁ బూర్వము సోమరుల దండించు నాచార ముండెను. ప్రథమమున నట్టివారల పేరులు వ్రాసికొని పాటుపడుట నేర్చికొమ్మని మందలించి వదలుచుండిరి. రెండవసారి యొక చేతిపైన రతి వేసియు మూడవసారి దెబ్బలు కొట్టియు నాల్గవసారి దెబ్బలుకొట్టి యొక చెవి తెగఁగోసియు నప్పటికిని బాటుపడు నభ్యాసము కావించుకొననిచో మరణదండన విధించుచు వచ్చిరి".

పాటుపడుట నమర్యాద లోపమని మందబుద్ధులు తలంచుచుందురు. లోహమును దేహమును రాపిడివలన దృఢపడి ప్రకాశించునని విచారించినవారి కెల్లరకును ధ్రువమగును. వాడఁబడు నినుము తళతళలాడుచుండునట్లు పాటుపడువాని దేహము కళాపూర్ణతచే నలరారుచుండును. అంతటను రక్తము చక్కఁగ వ్యాపించి బలిష్ఠమగును. మెదడు శుభ్రపడి నిర్మలచిత్తము కలుగును. నరములు బలపడును. ముఖవికాసము హెచ్చును. కన్నులు తేటగ నొప్పారుచుండును. మన యవయవములను మనము వాడినకొలఁది బలపడున ట్లీశ్వరుఁడు నిర్ణయించుట దలంచిన నది యొక యద్భుతముగఁ దోఁచును.

చిరకాలాభ్యాసముచే సామాన్యబుద్ధిమంతుఁడును విద్యయం దసాధారణపాండిత్యము నందఁగలఁడుగాని యితనికంటెఁ బదిరెట్లు వాకపక్యము కలవాఁడైనను గొలఁది యభ్యాసముచే వానితో సమత్వము నందఁజాలఁడు. అభ్యాసము చేయఁజేయ నది నైజముగ మాఱును. సదభ్యాసము సుగుణసంపదల నీనుచుఁ బూదండవలె శరీరముల నలంకరించును. దురభ్యాసము సర్పమువలె శరీరమును బెనవైచి విచారప్రాప్తి కలిగించును.

దినమున కొకశ్లోకము చొప్పునఁ జదివినవారలే పండితులు. విడువక యొక్కొక పాదచ్ఛాయ నడుచు నడచెడివారలే గమ్యస్థానము చేరుచుందురు. బిడ్డలు పండితులు కావలెనని కోరు తల్లులెల్లరును దినమున కొక నూతనాంశమును జెప్పి వారి నాహ్లాదపఱచుచుందురు. అట్టియోచన గలకుటుంబినులు మఱుదినము పిల్లలకుఁ దెలుపఁగల యంశముల నేటియుంచుకొనుచుందురు. చదువునప్పు డాయాసముకాని విసుగుకాని కలిగిన బిడ్డఁజేఁగినతోడనే కుమారయ్యామను వేడుకకిని ఖనులు కల్పించియు ముదావహముగు విషయములఁ జెప్పియుఁ దన్నివారణ మొనరించి మరలఁ జదువుట కుల్లాసము కలిగించును. మాన్పించుట యెప్పుడును జరగనీదు.

కాయకష్ట మొనరింపనివారి కెరికిని సుఖమే కలుగదు. ఎండ ఁగినవారికే నీడవలన నాప్యాయనము కలుగును. ఎండం దిరుగనివాఁడు నీడవలనఁ గ ప సుఖము మన మెఱుఁగఁజాలము. అటులనే కష్ట మొనరించనివానికి సుఖానుభవవ గాన్యము.

కావుననే కష్టమే సుఖమని వాడుక కలిగినది. కష్టీఫలీ. కష్ట మె ంచువాఁడే ఫల మనుభవింపఁగలఁడు. కష్టము లేకుండ నెట్టిఫలము లభించినను దానిఁ సినవాఁడు కష్ట మొనరించినవానివలె సుఖ మనుభవింపఁగలుగుట దుర్లభము. లోక నెవరికేని

యెంతెంతకష్టముల నోపరింపఁజేయఁగలిగినదియు నొకసుఖాపేక్షయే. తనకష్టమువలన ఫలప్రాప్తి కలుగదని యెఱిఁగిన వెనుక నెంతటికష్టకార్యమైనను నాపని రవంతయైన నుత్సాహముతో నెఱవేర్పఁజాలఁడు.

ఒక సంసారి మునుపటిదినమునఁ గటికచీఁకటిలో బరువైన పశుగ్రాసము మోసి కొనివచ్చి తన పంచయరుఁగుపై నొకరాత్రికి వైచి కష్టము నీఁదినట్లమ్మయ్యా యని త్రుటికాలము నిలువఁబడి పిమ్మటఁ దడియుచున్నవే పశువుల నాయొద్దరకాలిలో నవరించి మార్చి కట్టుము వానికడనున్న పేడ నెండలగు కళ్ళములు దీసివైచుచుఁ బ్రయాసపడుచుండెను. అది గాంచుచు నట నాసీనుఁడైయున్న సన్న్యాసియొకఁడు సన్న్యాసీ సుఖీ సంసారీ దుఃఖీ యని తలంచుచుండెను. అతని పని ముగించినతోడనే లోపలినుండి భార్య వేఁడివేఁడినీరు స్నానమున కమర్చి స్నానానంతరము పొడిగుడ్డతో నొడలు తుడిచి సుమ్ముచుకడఁ బీటపైఁ గూర్చుండిన భర్తకనుకూలముగు భోజనమిడి యనంతరము శయ్య నమర్చి యతఁడు పరుండిన వెనుకఁ బాదసేవ చేయుచుండెను. అయిదునిమిషముల కాలములోపలనే యతఁడు గుఱువెట్టి నిద్రింపసాగెను. కష్టమొనరింపకుండుటచే నిద్రపట్టక యిది విలోకించుచుండిన సన్న్యాసి తాఁదలంచినది సరికాదనియు సంసారీ సుఖీ సన్న్యాసీ దుఃఖీ యని యుండుట సముంజసమనియు నిర్ధరించెను.

సుఖప్రాప్తియుండుఁగల నమ్మకమే మన మెంతకష్టముతేని యోర్చుట కొడలు వంచి శ్రమ సహించునంతటి యుత్సాహిక మనయందు బాదుకొల్పఁజేయుచుండును. కావునఁ బసితనమునుండియు శిశువుల కీసంగతి తెలియునట్లు బోధించుట తల్లికి విధి.

కష్టపడకుండఁ గూడు కలిగియుండఁ జేతినిండఁ బనిచేయనివారలే సోమరులగుదురు. నడువఁగలిగినపుడును నెచ్చటికేని చంకఁబెట్టుకొని పోవుచుండుటయు నెత్తుకొని తిరుగుచుఁ బనులు వారు స్వయముగ నెఱవేర్చు సామర్థ్యము కలిగినపుడు నల్లా చేయనీక గారాబముచే నితరు లొనరించుచుండుటయు శిశువులను సోమరితన మందురింపఁ జేయును. తమ కవసరములగు పనుల నొరులు చేయవలెనను కోరిక కలిగించును. పెద్దవారయినకొలఁది నీకోరిక బలిసి వారిని మొనటిరకము సోమరిపోతులు నొనరించును. దారిద్ర్యమునకు సోమరితనము దోహదమొనరించును. శిశువు లోపల లొలయునట్లు పని చేయుటచేఁ గలుగు వ్యాయామసుఖకంటె సోమరులుగ నుండుటచేఁ గలుగు శ్రమ మధికమని తలిదండ్రులు తెలిసిఁగి పసితనమునుండియు నీడుకుఁదగిన పనులు చేయునట్లు ప్రోత్సాహము కలిగించుచుండవలెను. పని నియమింపకమున్న వారది చేయఁగలరని నిశ్చయించియే చెప్పవలెను. ఒకవేళఁ జేయఁజాలరని మన మెఱింగినచో వారది చేయనునట్టి తమ కసాధ్యమైనదని తెలిసికొని వదలునట్లు చేయవలెను.

సీ. ఆయుష్యమందమా యత్యంతచపలంబు,
వార్ధకంబా క్లేశవర్ధకంబు.
తారుణ్యమందమా తరళాతితరళంబు,
శైశవంబా జాడ్యసంహతంబు.
బాంధవులందమా భవబంధనంబులు,
లోకమా విషయకాలుష్యమయము,
భోగంబులందమా రోగస్వరూపంబు
లాపలా మృగతృష్ణికా సమములు
తే. మృత్యువా యెట్టివారలమీఁద నేని
యించుకంతయు మొగమోట మెఱుఁగఁబోదు
సంయమీశ్వర! యిట్టిసంసారమందు
నేరికేనియు నాస్థ వహింపఁదగునె? 384

వ. ఇదియునుంగాక 385

సీ. ఇంద్రియంబులె శత్రుబృందంబు లయిపోయె
సత్యం బసత్యతాచ్ఛన్న మాయెఁ
దనకుఁదా వైరియై మనసు బాధలనందె
భావముల్ పేలవత్వంబుచెందె
సకలకర్మములు దుష్ఫలదాయకములయ్యెఁ
దలఁపులు స్త్రీనిష్ఠితంబులయ్యెఁ
గోరికల్ విషయానుసారిత్వమున మించె
నాత్మచమత్కార మంతరించె.
గీ. మాయతెర గ్రమ్మి సకలంబు మఱుగుపరుపఁ
దెలియనేరక చిత్త మాకులితమయ్యె
సంయమీశ్వర! యిట్టిసంసారమందు
నస్మదాదుల కేరీతి నాస్థ గలుగు? 386

సీ. చిత్త మహంకారదత్తమై చెడిపోయె
వస్తు వవస్తురూపమునఁదోఁచె
రసము లత్యంత నీరసములై కనుపించెఁ
దరుణులు దోషప్రధానలైరి

భావసందోహం బభావోపహతమయ్యె
నాత్మతత్త్వంబు దురాపమయ్యె
అనురాగ మనురోగ మంతకంతకు హెచ్చె
వైరాగ్యభాగ్యంబు దూరమయ్యె
తే. సూక్ష్మదృష్టి నశించె రజోగుణమునఁ
దమము నానాఁటి కమితవిస్తారమయ్యె
సత్వగుణ మెంతయుఁ దుర్లభత్వ మందె
ఇట్టిసంసృతి నాస్థ వహించు టెట్లు ? 387

క. స్థితి కస్థిరత ఘటిల్లెఁ
ధృతికిఁ వైధుర్య మొదవె దినదినమునకున్
రతి హెచ్చెఁ దుచ్ఛసుఖముల
మృతి యాతటి వేచియుండె మీఁదఁ బడంగన్. 388

సీ. మనసు మాంద్యంబుచే మాలిన్యమును గాంచెఁ
దనువు నాశోన్ముఖత్వము వహించె
మొనసి జీవులనెల్ల ముదిమి కాల్చుచునుండెఁ
బాపంబు జగమెల్లఁ బండి నిండెఁ
బ్రాయంబు జతనానఁ బరువులెత్తఁ దొడంగె
సత్యత్వ మప్రకాశత నడంగె
సాధుసాంగత్యంబు చాల దుర్లభ మయ్యె
ఖలమైత్రి యెంతేని సులభమయ్యె
తే. కరుణ కఱవాయె సమ్మోదకలన వోయె
ధైర్య మరుదాయె నైచ్య మాధారమాయెఁ
దలఁపు చెడిపోయె సద్గతి తెలియదాయెఁ
బుట్టుచావుల లోకంబు మునిఁగిపోయె. 389

సీ. దైత్యబృందం బైన మృత్యువుపాలగు
ధ్రువునిజీవితమైన ధ్రువము కాదు.
సురసంఘమునకైన మరణంబు తప్పదు.
దిగ్గాలమైన నదృశ్యమగును.
దేశమ్ములైనను నాశమ్ము గనుచుండు
శైలమ్ములైనను సమసిపోవు

స్వర్గంబయినఁ గాలసంగ్రస్తమై చెడు
నంతరిక్షంబైన నడఁగిపోవు.

తే. భూమియైనను నిధనంబుఁ బొందుచుండు
నంబునిధులైన శుష్కంబులై నశించుఁ
దారకలునైన రూపవిదూరము లగు
నస్మదాదుల కింక స్థైర్యంబు గలదె? 390

చ. సముయును సిద్ధసంఘములు, సారససంభవుఁడుఁ నశించు, శ్రీ
రమణుఁడు రూపుమాయుఁ, ద్రిపురద్విషుఁడుఁ నిధనంబు నందుఁ గా
లము లయమందు, దైవము పలాయితమై చెడు, నాకసంబు నా
శము గను నస్మదాదులకు స్థైర్యముఁగల్గునె సంయమీశ్వరా! 391

చ. సురపతి తా మృతిఁ బడయు, సోముఁడు వ్యోమత నందు, భానుఁడుఁ
మరణముఁ పాలగుఁ, బొడవుమాయును వాయువు, కాలధర్మముఁ
బొరయును గీలి, యంతమునుఁ బొందుఁ గృతాంతుఁడు, విత్తనాయకుం
డెరయగు మిత్తికిఁ, గలుగునే చిరసంస్థితి మమ్ముఁ బోంట్లకుఁ. 392

ఆ. వె. ఇదియుఁగాక నిరత మీభువనము లెల్ల
మునివరేణ్య! కనఁగ వినఁగఁ బలుకఁ
దెలియరానిరూపు గలిగి మాయికుఁడైన
యొకనిచేత మోసమొందుచుండె. 393

క. అభిమాన కలావశతం
బ్రభవించినయట్టి జీవవర్గంబునఁ ద
ద్విభుతకు వెలియగుజంతువు
త్రిభువనములలోన లేదు ధీరవరేణ్యా! 394

తే. భానుఁ డీతనికిఁ రథభావ మంది
దుర్గమప్రదేశములందుఁ దోలఁబడును.
ఇతనిచేతనె భూగోళ మెల్ల ధిష్ణ్య
చక్రసంవృతమయ్యెను సంయమీంద్ర! 395

క. ఈతని సంకల్పముననె
భూతలమున నరులు, స్వర్గమున దేవతలుఁ

పాతాళమందు భుజగులు
జాతులగుట మృతియుఁగనుట జరుగుచునుండుర్. 396

వ. దేవా! యిట్టి పారతంత్ర్యదోషోపహతంబగు జగంబున విశ్రాంతి దుర్లభంబని వేఱ నుడువవలయునే! ఇందేనియు నెటులేనిఁ బ్రయత్నంబున మనశ్శాంతి సాధించుదమన 397

తే. అతనుఁ డఖిలేశ్వరునితోడఁ బ్రతిఘటించి
ముగ్ధజీవుల మాయచే మోసగించి
అక్రమంబుగ విక్రాంతుఁడై జగంబు
నాక్రమించుచునుండె నిరంకుశముగ. 398

తే. అతని సైదోడు మాధవుం డలసపోన
గురిసి దెసలెల్లఁ దావులఁ గ్రుమ్మరించి
మూఢజీవుల చిత్తంబు మోహపెట్టి
చాపలంబును బొందించు సాధుచరిత! 399

క. వలపుగల చెలుల వాల్చూ
పులు సోకినయంతఁ బొంగిపొరలెడు మనసుర్
నిలుపుకొన నరుల కెంతటి
తెలివియు నుపయోగపడదు ధీరవిచారా! 400

వ. ఇదియునుంగాక. 401

క. పొడముచు నడఁగుచుఁ గాలపు
బడబానలమందుఁ దుదకుఁ బడు కాఁపురపుం
గడలితరంగంబుల లె
క్కిడఁగా శక్యంబె యెవరికేని మహాత్మా! 402

క. దోసంపుఁ బొదలలోన ని
వాసంబొనరించు మానవమృగావళి పే
రాసయనునురులఁ జిక్కి మ
హాసంసృతిజంగలంబునందు నశించుర్. 403

శా. ఆకాశద్రుమవల్లికారచిత మిథ్యాకంఠపాశాభమై
శోకోత్పాదకమైన దుష్ఫలము లస్తోకంబు గల్గించు నా
నా కాకర్మము లాచరించుచు మృషానందంబునర్ జొక్కి చీ
లోకం బక్కట! జన్మజాలములఁ గోల్పోవుర్ నిజాయుష్యముర్.

## —♦ బౌద్ధహననము ♦—

చ. తొలుత నుపన్యసించుచును దోషనిరూపణపూర్వకంబుగన్
కలుషితవార్త నంత నవి ఖండనచేయుచు బౌద్ధ భట్టపా
దులు కదియం బరస్పరము ఘోరపునాదము బైలుదేరె న
బ్బలిసదనంబు నంతయును బ్రద్దలుచేయుచు బల్కఘోరమై. 49

తే. భట్టపాదబుధేంద్రుచేఁ బక్షములను
తర్కకర్కశవజ్రాహతంబులయి త
థాగతాద్రిసమూహముల్ తత్క్షణంబ
ఒయ్యనొయ్యనఁ బడిపోయె నుర్వి నహహా ! 50

మ. సరివారౌ పగవారు నాకుఁ బడయన్ సర్వజ్ఞనామంబులన్
సరెపో యంచు సహింపలేక యన నా సర్వజ్ఞుఁ డా బౌద్ధులన్
మఱి చిత్రస్థులమాడ్కి మౌనయుతులంగాఁ జేయఁగన్ నేలతేఁ
డిసుపమ్మొల్విన ధర్మసూక్ష్మతను దా నీక్షించి వే యిట్లనెన్. 51

శా. విద్యాయత్తము లీ జయాపజయముల్ వీక్షింపఁగాఁ గావునన్
సద్యస్కాలమునం దెవాఁడు కడఁకన్ శైలంబుపైనుండి తా
చోద్యంబంద జనంబు క్రిందఁబడియున్ శోభిల్లుఁ బాటుండ వాఁ
డాద్యుం డెన్నఁగ, నమ్మహాత్ము మతమే యారాధనీయం బికన్. 52

ఉ. జైనులు కొంద ఱద్ది విని సల్ప పరస్పరవక్త్రవీక్షలన్
మౌనముఁబూని వర్తిలుడు మంచిది రమ్మని వేదపూరుష
ధ్యానపరాయణైకమతి ధాత్రిసురాగ్రణి యెక్కె నొక్క గ
ట్రైను మృతుండఁగాను శ్రుతులే జగమందుఁ బ్రమాణమైనచోన్.

ఉ. అం చెలుగెత్తి చాటుచు మహాత్త బయల్పడఁ గ్రిందదూఁకె గు
ప్పించి నిజాత్మజాసుతులు ప్రేమ నొసంగిన పుణ్యమున్ విలో
పించుటకున్ యయాతిపృథివీపతి స్వర్గమునుండి వెండి నే
తెంచుచునుండెనొక్కొ జగతీస్థలి కంచు జనంబు చూడఁగన్. 54

ఉ. అంతటఁ గాయమందున రవంతయు గాయముగాకయుండఁగన్
వింతగ దూదిరుద్దవలె విశ్వగురుండు వడెన్ ధరిత్రిపై.
అంతవిహీనమైన శ్రుతి యాత్మశరణ్యుల కాగతంబులౌ
వంత లడంచు టబ్బురమె? వైదికవర్తనమన్నఁ జిన్నదే! 55

చ. విని తదుదంత మంతఁ గడు వింతయి దిక్కులనుండి భూసురుల్
కనుగొన నేగుదెంచి రతికౌతుకమొప్పఁ దదద్రియొద్దకున్
ఘనతర మేఘనిస్వనము కర్ణములంబడ నాటలాడు చిం
శానర మయూరముల్ పొదలనుండి వడిం జనుదెంచులాగునన్ 56

శా. భూమీశాగ్రణి యత్తలౌంగుఁ దగునా భూమీసురాగ్రేసరుల్
ధీమంతుం గని శ్రద్ధఁబూని శ్రుతులన్ నీచాత్ములంగూడి నా
బాముల్ వ్యర్థముఁజేసినాఁడననుచుం బల్మాఱు నిందించుకో
నా మూర్ఖాగ్రణులైన బౌద్ధు లనిరి ట్లారాజు నీక్షించుచున్. 57

చం. కాదు ప్రమాణ మిద్ది నృప! గట్టిగ నీమతనిర్ణయంబునన్
మేదిని మంత్రతంత్రముల మేలగు మందులఁ జేసి మేను లీ
మాదిరి రక్షితంబు లగు; మాకును గొంచెము గుర్తె. ఇంద్రజా
లాదులు నేర్చినంతన కులాధికు లయ్యెదరొక్కొ మానవుల్ ? 58

చం. అనుచుఁ దదద్భుతంబు కనులారఁ గనుంగొనియున్ మనంబులన్
తనియక మొండివాదముల దక్షులుగా భ్రుకుటీభయంకరా
ననుఁడయి యందఱొక్కపతి నాదగు ప్రశ్నము నాలకించి వెం
టనె బదులీయఁగావలె. క్షణంబయినం దడయంగఁ గల్గినన్ 59

ఉ. ఇంచుకయేని లేక దయ యే బలుయంత్రపురాలలోన ద్రో
బ్బించెదనంచు నుగ్రముగ బృథ్వ్యధినాథుఁడు వల్క పన్నగో
దంచితమైన యొక్క ఘట మచ్చటి కొయ్యన భృత్యుచేతఁ దె
ప్పించి ప్రవృద్ధకోపమునఁ బిల్చె తథాగత భట్టపాదులన్. 60

చ. అడుగఁగ దీన నేమిగల దంచు, మహీశ్వర! రేపు ప్రొద్దునన్
తడయక వచ్చి చెప్పెదము, తథ్య, మనుగ్రహముంచి యీయుమీ
గడువని బిట్టువేడుకొని కైకొని యానతి, యేగి రెల్లరున్
గడుపున గంపెఁ డంత భయకంపము పొచ్చి పగుల్చుచుండఁగన్

ఉ. కుత్తుకబంటినీట దిగి కొంకక యాపయి భట్టపాదుఁ డ
త్తెత్తి సరోజమట్లు దివసేశునిగూర్చి తపంబు సేయుచున్
బత్తికి మెచ్చి యాతఁ డల బ్రాహ్మణు డగ్గఱి తన్మహత్తలో
కోత్తరముం బొనర్ప నెదియో వచియించి చనెం గృపామతిన్. 62

ఉ. కేరళశాస్త్రమందుఁ గడుఁ గీర్తివహించినయట్టి బౌద్ధులున్
చారుఘటస్థ వస్తువును జక్కనెఱింగి సుధన్వుకొల్వునన్
చేరి భుజంగ మిద్ది యని చెప్పుచు ధీరత రాయిఁ గ్రుద్ది; ర
ప్పాలుఁడు శేషశాయియగు పద్మదళాక్షుఁ డటంచుఁ జెప్పఁగన్. 63

ఉ. అక్కలశాంతరస్థమగునట్టి భుజంగముగాక యొక్క డిం
బొక్కఁడు చెప్పినట్టి ద్విజునుక్తి చెవింబడ భూపునాననం
బక్కట! ఎండిపోయిన మహాసరసిన్ స్థితమైన పద్మమ
ట్లుక్కఁదొఱంగి యుండుటయు నొయ్యన నాతని శంకఁ బాపుచున్.

చ. అపు డశరీరవాణి కర మచ్చెరువంది వినంగ నందఱున్
నృపవర! భట్టపాదునుడి నిక్కమె, సందియమొంద కింక నీ
విపుడ ప్రతిజ్ఞదీర్చుకొనుమీ యనఁ జూచెను మూఁత దీసి రా.
జపుడు ఘటంబునన్ సుధ సురాధిపుఁడట్ల భుజంగశాయినిన్. 65

ఉ. చూచి నిరస్తశంకుఁడయి చోద్యమునొందుచు లోన సేతుశీ
తాచలమధ్యనున్న సుగతాన్వయమంతయు మాపకున్నచో
కాచక మిమ్మె త్రుంతునని గట్టిగ నానతియిచ్చి పుచ్చెఁ బెన్
బూచులఁబోలు భృత్యులను భూపతి నిర్దయుఁడై రయంబునన్ 66

ఉ. ఎక్కువదైన దోషము సమీక్షితమైన మహాత్ముచే వెసన్
మిక్కిలి యిష్టుఁడేనియును మృత్యువుబారికిఁ ద్రోయ నర్హుఁడౌ.
మక్కువఁ గన్నతల్లియనుమాటయు లేకయె గండ్రగొడ్డఁటన్
చక్కని రేణుకారమణిఁ జంపఁడె భార్గవరాముఁ డుగ్రుఁడై! 67

ఉ. చచ్చిరి భట్టపాదబుధు చక్కనిత్రోవను ద్రొక్క తేనిచే
చచ్చెర ధర్మహీనులగు శీఘ్రను లందఱు నీవిధంబునన్
హెచ్చుగు తత్త్వమూని మహి నిద్ధయశుండగు యోగివర్యుచే
నచ్చపుయోగముం గలఁచనయ్యెడు విఘ్నసమూహమట్టులన్. 68

ఉ. ఆ ఖలులైన బౌద్ధజను లందఱుఁ గూలినపిమ్మటన్ సుధీ
శేఖరుఁ డెల్లెడన్ వెలయఁజేసె బలీయన శ్రౌతమార్గమున్
తా ఖచరాధినాథుఁ డల ధ్వాంతము వాయుననంతరంబు స్వీ
యాఖిలతేజమున్ భువనమంతట వ్యాప్తముఁ జేయుచాడ్పునన్. 69

ఉ. జైనగజాధమంబులను జంపఁ గుమారిలసింహ మెచ్చెరా
వే నిగమద్రుమంబు లిల విఘ్నము లేక వివృద్ధిఁ జెందె. ఈ
మానిత కర్మమార్గము కుమారుఁడు వ్యాప్తముఁ జేయ నీవిధిన్
పూనె భవాబ్ధిమగ్నులగు భూజనులం దరిఁ జేర్ప నీశుఁడున్. 70

మ. ఇటులం బూని కృపాసముద్రుఁడగు నాయీశుండు పూర్ణానదీ
తట రాజద్వృషభాద్రిపైని వెలసెం దా నుద్భవల్లింగమై.
అటఁ దత్ప్రేరణ రాజశేఖరుఁడు నా నాకేరళాధీశుఁ డు
త్కట తేజంబగు దేవళంబు నెలమిం గట్టించి పూజించెడిన్. 71

ఉ. వందనమాచరించు జనవర్యుల పీడలఁ బాపుచుండు నా
కందునిసూదు భూరికృపకల్మిని బ్రాప్తనిరీతిభావమై
అందముగల్గి కాలటిసమాహ్వయమైన యొక గ్రహార మా
సుందరపర్వతాంతిక వసుంధర వర్తిలుచుండు గొప్పగన్. 72

తే. అచట విద్యాధిరాజాఖ్య నలరునట్టి
ఒక్క విద్వచ్ఛిరోమణి యున్నవాఁడు
ఆ వృషాహార్యధాముఁడౌ నభవుఁ దతని
కొడుకుఁ దన తండ్రిఁ జేసికోఁ గోరినాఁడు. 73

శా. సూనుం డోజ సముద్భవించి తనకున్ సుబ్రహ్మతేజస్కుఁడై
జ్ఞానంబందు శివున్ వచస్సుల గురున్ స్పర్ధాళువై చూచుడున్
సానందుండయి వానికిన్ శివగురుం డన్ పేరు విద్యాధిరా
జౌనౌ నియ్యది సార్థకంబనఁ బ్రజల్ వ్యాప్తంబు గావించెఁ దాన్.

శా. ఆవిద్వాంసుని సూనుఁడౌ శివగురుం డాచార్యగేహంబునన్
తా వర్తించుచుఁ దత్క్రియాపరతఁ బ్రాతస్స్నాయముల్ హవ్యవా
ట్సేవం జేయుచు భైక్షమందు గురు నుచ్ఛిష్టంబు భోంచేయుచున్
బ్రావల్కుల్ పఠియించె నస్ఖలితమై క్రాల్ బ్రహ్మచర్యంబునన్. 75

తే. చక్కఁ బఠియించి యర్థవిచారమునకు
పూనె. అయ్యది యరయ దుర్బోధమైన.
నగునుగా. కది యెఱుఁగకే యాచరింపఁ
బడెడి కర్మంబులెల్ల నిష్ఫలము లగును. 76

# సహాయులు

౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి
౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల.
౪ తిరుమలనల్లాన్ చక్రవర్తివరదాచార్యుల అయ్యవార్లంగారు,
శాంతాపురము.
౫ రాయచూరి బండేరావుగారు, అయినాపురము.
౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.
౭ చిక్కరాజు వట్టెల్లిరావుగారు - చెలకుర్తి.
౮ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు శ్రీశ్రీ జగద్గురు
పుష్పగిరి సంస్థానపు ఏజంటు.
౯ అద్దంకి ... తిరువేంగడ తాత దేశికాచార్యులయ్యవార్లంగారు.
తక్కెళ్ళపాడు.
౧౦ మియ్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.
౧౧ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.
౧౨ కురికాల వెంకటేశ్వరరావు దేశముఖుగారు, పులిగెళ్ళ.
౧౩ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.
౧౪ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.
౧౫ వద్దిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, మేడిపల్లి.
౧౬ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణికాలరీసు.
౧౭ మారేపల్లి వెంకటకిషన్ రావు, మాధవరావు దేశముఖుగార్లు
కాకర్లపల్లి.
౧౮ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి
౧౯ మద్దూరి సాంబయ్యగారు - పొగాకుకంపెని - పరుచూరు.
౨౦ ముద్దు చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు
కొత్తపల్లి
౨౧ రాయప్రోలు సుబ్బారావుగారు, ప్రొఫెసర్,
యూనివర్సిటి కాలేజి, హైదరాబాదు.
౨౨ పెసర వెంకటరెడ్డి దేశముఖుగారు, పుల్లారెడ్డిపల్లె.
౨౩ గడ్డం వెంకటనరసింహారెడ్డి దేశముఖుగారు, చెలుకుపల్లి.

# అభినవ సరస్వతి.

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనము
లును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 2 | నీతిగీతలు (సుమతిశతకము, దానిశ్లోకములు) ... | 0 | 2 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 4 | కరణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] ... | 0 | 4 | 0 |
| 5 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 6 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 7 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 8 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము ... | 0 | 10 | 0 |
| 9 | సూతసంహిత (ఆంధ్రము) ... | 2 | 0 | 0 |
| 10 | భారతీయప్రబోధము (పికుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |
| 11 | ధర్మనిర్ణయము ... | 0 | 4 | 0 |
| 12 | అస్పృశ్యతానివారణఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | 0 | 8 | 0 |
| 13 | స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము (౧ సంపుటము) | 1 | 0 | 0 |
| 14 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 15 | డిటో నాగరఖండము (౩ సంపుటము) | 1 | 8 | 0 |
| 16 | డిటో నాగరఖండము (౪ సంపుటము) | 1 | 8 | 0 |
| 17 | పల్నాటివీరచరిత్ర | 0 | 12 | 0 |
| 18 | భాగవతరహస్యములు | 0 | 4 | 0 |
| 19 | సోమేశ్వరశతకము | 0 | 2 | 0 |
| 20 | జాతకచర్య (స్వకీయులచరిత్ర) | 1 | 8 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్లపోస్టు,
గుంటూరు జిల్లా.